శ్రీ లక్ష్మీ నృసింహ సహాయోఽస్తు.

B-20



# శ్రీ సింహాద్రినాథ సుప్రభాతము.

పూర్వకవి ప్రణీతము.

శ్రీ సింహాచల దేవస్థానమువారిచే ప్రకటింపబడెను.

వెల. 0-15 న.పై

# శ్రీ సింహాద్రినాథ సుప్రభాతము.

శ్లో॥ స్వామిన్కిరి నర మృగరాడత్యద్భుత
రూప నిత్యసుకుమార ।
హేయ ప్రతిభట మంగళ గుణ
కేతన సుప్రభాత మమలంతేస్యాత్ ॥ 1.

తా॥ ఓ స్వామి ! శ్రీ వరాహలక్ష్మీనరసింహ ! అద్భుతమగు రూపము గలవాడ! ఎల్లపుడు సుకుమార శరీరుడ! చెడుగును పోగొట్టువాడ! మంగళ గుణాకరుడ ! నీకు మంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ అనేక శాఖానుగత ద్విజా నా
మాస్య ప్రసూతై శ్శ్రుతి రమ్యనాదైః ।
లోకః ప్రబుద్ధస్త్వమివాద్య సర్వః
సింహాద్రిధామన్ తవ సుప్రభాతమ్ ॥ 2.

---

(1) శ్రీ నిడమర్తి కందాడై రామానుజార్యస్వామివారిచే రచింపబడిన సింహాద్రినాథ వైచిత్ర్యము నుండి –

(2) శ్రీ రామభట్ల జగన్నాథశాస్త్రిగారిచే రచింపబడినది.

తా॥ బహువిధములగు వేదశాఖలందలి బ్రాహ్మణముఖములనుండి ఉచ్చరించబడు, చెవులకింపైన వేదధ్వనులచే, నీవలె సకలలోకము మేలుకొనినది. అనేక వృక్షశాఖలందు నివసించుచున్న పక్షుల చెవులకింపైన ధ్వనులచే లోకము, నీవలె మేలుకొనినది. సింహాద్రినివాస! నీకు మంచి పొద్దగుగాక.

శ్లో॥ ఆమోదయన్నాస్య మివాబ్జినీ నాం
రాత్రౌ వియోగార్తి వివర్ణశోభమ్ ।
ఉ దేతి నృణాం హృదయం వివస్వాన్
సింహాద్రిధామన్ తవ సుప్రభాతమ్ ॥ 3.

తా॥ రాత్రియందు, సూర్యుని వియోగముచే, వైవర్ణ్యము చెందిన, తామరల ముఖమనదగు పద్మములను, వాసన కలవానినిగ చేయుచున్నటుల, మానవుల హృదయాబ్జకోశములను పరిమళింపచేయుచు, సూర్యుడు దయించుచున్నాడు. సింహగిరి నిలయ! నీకు మంచి పొద్దగుగాక.

శ్లో॥ సద్వా సనాథ్యం సుమనస్సమూహం
తమో నిమగ్నం వి మృశన్నిశాన్తే।
ఆ యాతి వాతస్త్వ సన్నిధానం
సింహాద్రిధామన్ తవ సుప్రభాతమ్ ॥ 4.

తా॥ ప్రభాతకాలమందు చక్కని వాసనాపూర్ణమగు, పుష్పసమూహమును, చీకటిలో మునిగియుండ తాకుచు, నీవద్దకు వాయువు వచ్చుచున్నది. బ్రహ్మవాసనాపూర్ణమగు, సుమనసుల సంఘమును, జ్ఞానోదయ కాలమందు, అజ్ఞానాంధకారములో మునిగిన దానిని తాకుచు ఆచార్య పదమునందున్న వాయువు నీ చెంతకు చేర్చుచున్నాడు. ఓ సింహనగ నివాస : నీకు మంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ సింహాభిధానం భగవన్భవన్తం
ద్రష్టుం కిలైతే గజపత్యభిఖ్యాః।
స్థితాస్త్వ దీయాలయ పూర్వభాగే
సింహాద్రిధామన్ తవ సుప్రభాతమ్ ॥ 5.

తా॥ సింహమను పేరుగల (నామైకదేశేనామగ్రహణం) అను న్యాయముచే నరసింహనామమందలి యేకదేశమగు నిన్ను, సేవించుటకు గజపతులను బిరుదుగల విజయనగర మహారాజులు, నీయాలయమునకెదుట నిలచియున్నారు. సింహగిరియందు నివసించుస్వామి! నీకు మంచి ప్రొద్దగుగాక. సింహము నివసించు గుహముందు ఏనుగులు వేచియుండుట విరుద్ధము. నరసింహుని సేవకై విజయనగరాధీశులగు గజపతులు వేచియుండుట యుక్తము.

శ్లో॥ పురూరవాస్త్వాం పురతః ప్రపన్నః
పురాకిలా సీత్పురుహూత సేవ్యః।
పునస్త్వ దర్చార్థ మిహావిరస్తి
సింహాద్రిధామన్ తవ సుప్రభాతమ్ ॥ 6.

తా॥ దేవేంద్రునిచే గూడ సేవింపబడునట్టి ప్రభావముగల ప్రాచీనుడగు పురూరవచక్రవర్తి పూర్వము నిన్నారాధించినాడు. తిరిగి నీయారాధనకై యిచటనున్నాడు-సింహాచలవాస! నీకు మంచిప్రొద్దగుగాక.

శ్లో॥ ప్రహ్లాద నామా ప్రణతః కిలాదౌ
ప్రపన్న ముఖ్యస్తవ బాలకో యః ।
సోఽయం సమేతస్తవ సేవనాయ
సింహాద్రి ధామన్ తవ సుప్రభాతమ్ ॥ 7.

తా॥ ప్రపన్నులలో మొదటివాడు, అగు ప్రహ్లాదుడను, పిల్లవాడు ఎవడు కలడో, ఆప్రహ్లాదుడు తిరిగి నీసేవకై వేచియున్నాడు. సింహాచల నివాస! నీకు మంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ శ్రీకృష్ణరాయాది మహాక్షితీశైః
క్షేమాయలోకస్యపురార్చితస్త్వమ్ ।
స్వామిన్! జగద్రక్షణ మద్య కార్యం
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్॥ 8.

తా॥ లోకక్షేమము నాశించి, శ్రీకృష్ణరాయాది మహీపాలులు, పూర్వము నిన్నారాధించిరి, గాన తత్ఫలమగు జగద్రక్షణ మిపుడు చేయవలెను. ఓ సింహాచలపతి! నీకుమంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ సారూప్యదాతా త్వమితీవ వక్తుం
విమాన మారుహ్య వియత్ప్రదేశే।
చరన్తికే చిత్పరితోగిరింతే
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్॥ 9.

తా॥ సారూప్యాది మోక్ష చతుష్టయములో, నీవు సారూప్య మోక్షము నిచ్చువాడవు. అనునటుల. విమానములపై నెక్కి. నీకొండచుట్టు కొందరు తిరుగుచున్నారు. సింహాచలాధిప! నీకు మంచి ప్రొద్దగుగాక.

సింహము కొండలపై తిరుగును. గాన నీరూపమును కోరువారు గూడ కొండలపై తిరుగుచున్నారట.

శ్లో॥ అత్యన్త దూరాగమన ప్రయాసా
న నన్యభక్త్యాఽవిగణయ్య చిత్తే।
నిరీక్షతే త్వామిహ వైష్ణవాళిః
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్ ॥ 10.

తా॥ నీయందలి యేకాన్త భక్తిచే, మిక్కలి దూరమునుండి వచ్చుట

వల్ల కలిగిన శ్రమను మనసులో లెక్కచేసికొనక నీవైష్ణవ భక్త సంఘము, నీసేవకై నిరీక్షించుచున్నది - ఓ సింహనగనివాస! నీకు మంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ యాత్రాగతోచ్చారిత మాసమన్తా
ద్గోవిన్దనామాపి దివీవభూమౌ ।
సంశ్రూయతే సంప్రతి సర్వలోకైః
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్॥ 11.

తా॥ యాత్రార్థులుగా వచ్చిన భక్తులచే పలుకబడిన "గోవిన్దా" యను నామము, శబ్దగుణకమైన యాకసమందువలె, భూమియందు గూడ, సకల జనులచే వినబడుచున్నది. సింహగిరీశ! నీకు మంచిప్రొద్దగుగాత.

శ్లో॥ త్వత్పాదపద్మోద్భవ దివ్యగంగా
ప్రవాహ మగ్నద్విజ పఙ్క్తిజాతః।
సంశ్రూయతే సంప్రతి మన్త్రినాదః
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్॥ 12.

తా॥ నీపాదపద్మములందు బుట్టిన, దివ్యగంగాజల మందుమునిగిన, బ్రాహ్మణ ముఖములనుండి బుట్టిన మంత్రధ్వని వినబడుచున్నది - ఓ సింహాద్రిధామ! నీకు మంచిప్రొద్దగుగాక.

(గాంగధారాజలస్నాతులగు, బ్రాహ్మణుల మంత్రధ్వని, ఆకాశగంగ యందు స్నానముచేసిన పక్షుల కూతలు అనుట)

శ్లో॥ త్వదన్యదేవార్చన ధీవిరక్తాః
త్వన్నామమాత్ర స్మరణాను రక్తాః
పూజార్థమేతే పురతః ప్రసక్తాః
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్ ॥ 13.

తా॥ నీకంటె నితరులగు, దేవతలను, సేవించనివారు, నీపేరును స్మరించుట, స్వభావముగా గల నీభక్తులు పూజకై నీముందుకు వచ్చియున్నారు - ఓహరిగిరీశ! నీకు మంచిప్రొద్దగుగాక.

శ్లో॥ పఞ్చామృతార్థం తవ కామధేనోః
పయశ్చపాద్యాయచగాఙ్గమమ్భః।
ఆదాయశక్ర స్సముపాగతోఽత్ర
సింహాద్రి ధామన్ తవసుప్రభాతమ్॥ 14,

తా॥ నీకు పంచామృత మర్పించుటకు కామధేనువు పాలను, పాద్యమునకు గంగాజలమును తీసికొని దేవేంద్రుడిచటకు వచ్చినాడు. ఓ సింహగిరిధామ! నీకు మంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ సవాసవాస్సామ్పృత మాదితేయాః
సన్తాన వృష్పాణి సపల్లవాని।
పూజార్థమాహృత్య పురస్థితాస్తే
సింహాద్రి ధామన్ తవ సుప్రభాతమ్॥ 15.

తా॥ దేవేన్ద్రునితో గూడిన దేవతలు. చిగుళ్ళతో గూడిన సన్తాన పుష్పములను నీపూజకొరకై తెచ్చి నీయెదుట నున్నవారు. ఓ సింహగిరీన్ద్ర! నీకు మంచిప్రొద్దగుగాక.

శ్లో॥ భక్తాంఘ్రిరేణుస్త్వ పాదభక్తః
ప్రాబోధికాంతేగిర మద్యగాతుమ్।
ఆదాయమాలాస్సము పాగతోఽత్ర
సింహాద్రి ధామన్ తవ సుప్రభాతమ్ ॥ 16.

తా॥ నీ పాద భక్తులగు, శ్రీ విప్రనారాయణ స్వాములు, నిన్ను మేలుకొలపెడి తిరుప్పళ్ళియెళుచ్చియను దివ్యప్రబంధమును పాడుటకు మాలలు చేతబూని, నిచటకు వచ్చియున్నారు. ఓ సింహాచలస్వామి నీకు మంచి ప్రొద్దగుగాక.

శ్లో॥ శ్రీకృష్ణ మార్యస్త్వ గాయకాగ్ర్యః
రామానుజాచార్య గిరాప్రబుద్ధః।
గాతుంత్వ దీయంచరితం ప్రవృత్తః
త్వంనర్త్తితుంయాహివిముఞ్చ శయ్యామ్॥ 17.

తా॥ నిన్ను పాడినవారిలో నుత్తముడగు శ్రీకాన్త కృష్ణమాచార్యులను

భక్తులు, శ్రీభగవద్రామానుజాచార్యుల వారి యుపదేశముచే, జ్ఞానము కలవారై నీచరిత్రము పాడుటకు వచ్చిరి. నీపాడుటకు పడకను విడువుము. (శ్రీరామానుజాచార్యుల దిగ్విజయకాలములో నిచట శ్రీకాన్త కృష్ణమాచార్యులు వారనుభక్తులు, పాడగ, శ్రీదయామయుడగు, సింహాచల స్వామి ఆడినటుల నైతిహ్యము కలదు)

శ్లో॥ యేతావకేనగిరి సానుషు పుష్పితాగ్రాః
పున్నాగ చంపక వరాహ కరీరవృక్షాః।
ఆమోదముద్వహతి వాయురసౌహితేషాం
సింహాద్రి నిత్యవసతే తవ సుప్రభాతమ్॥ 18.

తా॥ నీకొండ చరియలపై పుష్పించిన కొమ్మల కొసలుగల సంపంగి పొన్న, వారాహములు (నూరువరహాలు) గన్నేరు మొదలగు వృక్షములు గలవో, వాటిపరిమళము నీవాయువు మోయుచున్నది, సింహగిరి నిత్య వాస! నీకు మంచి ప్రొద్దగుగాత.

శ్లో॥ రమ్యాణియాని మధురాణి పచేలిమాని
సీతాఫలామ్ర కదలీపన సద్వయాని।
పూగాని తాని దదతేఽద్య ప్రగృహ్యతుభ్యం
సింహాద్రి నిత్యవసతే తవ సుప్రభాతమ్॥ 19.

తా॥ చూచుటకింపైనవియు, మధురమైనవియు, పండినవియు నైన సీతాఫలములు, మామిడిపండ్లు, అరటిపండ్లు, పనసపండ్లు, అనాసపండ్లు, పోకపళ్ళను, తమకర్పించుటకు, నీభక్తులు, చేతబట్టుకొని నీకుసమర్పింప నుద్యమించుచున్నారు - నీకు మంచి ప్రొద్దగుగాత.

(1) శ్లో॥ ప్రాబోధికాం వదతితే మధురం ధ్రువైషా
తూర్యం బహిర్బహి రుదఞ్చతి మన్దమన్దమ్,
తిష్ఠన్తిసాఞ్జలి పుటాస్సభయాశ్చ సర్వే।
సింహాచలేశ! జగదీశ! విముఞ్చ శయ్యామ్॥ 20.

(1) శ్రీ మదానన్ద గజపతి మహారాజాస్థాన కవియగు, భగవత్కవి శ్రీ మన్మథుంబై నరసింహాచార్యస్వామివారి రచనగా నిచట వాడుకగలదు.

తా॥ భరద్వాజపక్షి మధురముగ నీ మేలుకొలుపులు పాడుచున్నది. మెల్లమెల్లగ తూర్యనాదము వెలువడుచున్నది. నీ దర్శనార్థులెల్లరు, చేతులు జోడించి భయముగ నిలచియున్నారు. సింహాచలాధిప ! జగన్నాథ ! పడక విడువుము.

శ్లో॥ ధారా సుతాపక నగేపురుహూత ముఖ్యాః
స్నాత్వాదిశాధిపతయో మునయశ్చభక్తాః ।
కాంక్షన్తి దర్శన ముపాహృత దివ్యపుష్పాః
సింహాచలేశ ! జగదీశ విముఞ్చ శయ్యామ్ ॥ 21

తా॥ నీకొండపై ప్రవహించు, గంగధారాది ధారలందు, దేవేంద్రుడు మొదలగు దేవతలు, దిక్పతులు, మునులు, భక్తులు, స్నానమాడి, చేత బట్టిన కల్పవృక్షముల పుష్పములు కలవారై నీదర్శనమును కోరుచున్నారు. సింహాచలాధీశ ! లక్ష్మీనృసింహ - పడక విడువుము.

శ్లో॥ ఏషాపరేశ! కపిలామ సృణాచధేనుః
వీణాచదర్పణ మిదం గజరాజ ఏషః।
కుమ్భోయమమ్బు నిచితో విజధామ సంస్థాః।
సింహాచలేశ! జగదేశ! విముఞ్చ శయ్యామ్॥ 22.

తా॥ ఓపరాత్పర! కపిలవర్ణము గల నునుపైని యీ తొలిచూలి యావు, వీణ, ఈయద్దము, మదపుటేనుగ, నీముంగిలి వాకిలియందున్న పూర్ణకుంభము మొదలగు మంగళద్రవ్యములు నీ విశ్వరూప సేవకై సిద్ధముగనున్నవి. ఓ సింహాచలాధిప! లోకనాయక, పడకవిడువుము.

శ్లో॥ భృఙ్గీహతాన్మకుళితాంబుజ గర్భరుద్ధా
నిద్రాతి తన్మధురసగ్రసనేన మత్తా।
భృఙ్గః ప్రబోధయతితాం ప్రవిశన్నిదానం నీం
లక్ష్మీనృసింహ! జగదీశ! విముఞ్చశయ్యామ్ ॥ 23.

తా॥ తొలినాడు సాయంకాలమగుటచే ముడుకొనబడిన తామరపువ్వ

నందు రుద్ధమై మకరందరసముచే మత్తెక్కిన యాడుతుమ్మెద నిదురించుచున్నది. సూర్యకిరణములచే కొంచెము విడుచున్న ఆ పుష్పమందు ప్రవేశించి మొగతుమ్మెద యాడుతుమ్మెదను లేపుచున్నది. లక్ష్మీనృసింహా! సకలలోకప్రభో! పడక విడువుము.

సింహాద్రినాధ సుప్రభాతము ముగిసెను.

